# అమర సందేశం

—: ఇందులో :—



మూలం:—శంకర్‌దేవ్, యం. ఏ

( వేదాలంకార్. )

అనువాదం :—

సి. ఐ. ఆంద్రూస్,

యం. జె. త్యాగరాజు.

( జంటకవులు. )

దళిత సారస్వత పరిషత్తు,

A/12/375/1 దోమల్‌గూడ, హై.ద.

ప్రథమ ముద్రణ 10,000. ప్రతులు. ధర: 0-4-0

1955

# ముఖ్యమంత్రి అపూర్వ సందేశం



దళిత సారస్వత పరిషత్తుచే ప్రచురింపబడుచున్న "అమర సందేశం" అను వచన కావ్యం నా అభిప్రాయం కొరకు పంపబడినది. ఈ గ్రంథం చాలా చిన్నదిగా ఉన్నప్పటికీ, ఇందలి విషయాలుమాత్రం, యావద్భారత దేశాన్ని, యుగాలనాటినుండి బాధించుచున్న "అస్పృశ్యతా నివారణ" కొరకై వ్రాయబడిన ఒక విప్లవ విషయాన్ని మన ముందు పెటుతోంది.

గ్రంధకర్త అభిప్రాయంతో నేనూ ఏకీభవిస్తూ, హరిజనేతరులే యీ కార్యసిద్ధికి పూనుకోవాలని కోరుచున్నాను. భారత ప్రభుత్వం అంటరాని తనాన్ని పోగొట్ట ప్రతి యేటా కోట్ల రూపాయలు వెచ్చించి ప్రచారం సాగిస్తూ వుదిం. కులీనులు యిప్పటికైనా హరిజన సోదరుల యెడల సామాజిక ప్రేమ జూపగలరని నమ్ముచున్నాను.

ఆఖరుగా దళిత సారస్వత పరిషత్తు ప్రచురణాలు, సామాజిక చైతన్యతకు ఎంతయు వుపయుక్తపడతాయని, దళిత సారస్వత ప్రియులు మరీ మరీ యిట్టి గ్రంధాలు ప్రజానీకానికి అందించగలరని, తద్వారా, సాంఘిక సమత సాధించగలరని, నమ్ముచు ఈ గ్రంధాన్ని చదువరులకు సన్నిహిత పరుస్తు వున్నాను.

బూ॥ రామకృష్ణారావు.

# ఇంకొకసారి మీతో!



ఇంట గెలిచిగాని రచ్చ గెలువ మన్నారు పెద్దలు. ఈ ప్రథమ కర్తవ్యాన్ని 'హరిజన శంఖారవం'తో పూర్తి చేసికొన్నానని నా దృఢ విశ్వాసం. నా సోదరులకు, అనుచరులకు, మిత్రులకు, శంఖారంలో చెప్పదగినదంతయూ కట్టె, కొట్టె, తెచ్చెనన్న స్థాయిలో నివేదించు కొన్నాను.

ఇక మిగిలిన నా ధర్మతను హరిజనేతరులైన మీకే నెరవేర్చాలి. నా నిత్య జీవితంలో విన్నది, కన్నది, నా హిందూ సోదర బృందానికి క్లుప్తీకరించి విన్నవించు కొంటున్నాను, ముక్తసరిగా చెప్పాలంటే

సీ॥ " గుడిలోన మీపూజ - గుడిబైట మాపూజ
ఎన్నాళ్లు ! చేతుమో అన్నినాళ్లు !
వూరిలో మీబావి - వూరికావలిమాది
ఎన్నాళ్లు ! వుందునో అన్నినాళ్లు !
బడిలోన మీవారు - బడియెదుట మావారు
ఎన్నాళ్లు ! వుందురో అన్నినాళ్లు !
నట్టింట మీతిండి - నడివీధిలో మాకు
ఎన్నాళ్లు ! పెడుదురో అన్నినాళ్లు !

పోదు యీ అంటుజాఢ్యము పోదుపోదు
రాదు మతవర్గ రహిత సామ్రాజ్యమింక
పంచములతోడ బాంధవ్య మ్ముంచకున్న
హృదయ పరివర్తనంబు చేనొదవునన్న ? "

ఇదే నా అమర సందేశం. గాంధీజీ ఆసించిన అపూర్వ విప్లవం. మరింత సన్నిహితులముగా గల్గుటకు, ఇక ముస్ముందు ఇట్లాగే కలిసికొంటూ వుందాం.

గ్రంథకర్త :
శంకర్‌దేవ్.

# మా రెండో పుష్పం



ప్రకృతిలో ఏ ఫలమైనా ఆలస్యంగా లభ్యమౌతోంది. మా దళిత సారస్వత, వనంలో పలురకాల భాషా ఫల, మహీరుహాల నాటు పెట్టితిమి. ఇప్పుడిపుడే తోట కాతకు మరలింది. ప్రప్రదంగా మా తోటనుండి, "హరిజన శంఖారవాన్ని" అనేక ప్రాంతాలకు ఎగుమతి చేసివున్నాము. ప్రథమఫలం రుచితనానికి, చదువరులు యీతోట ఫలాలనే యుపేక్షిస్తువున్న కారణంచేత, యీ రెండో పుష్పాన్ని మీచేతి కందిస్తు వున్నాం. దీన్ని మీ మీ శిరస్సుపై ధరింతురో కాక జేబుల్లో నుంతురో, చదువరుల అభిరుచిపైన వదలివేస్తు న్నాము.

ఈ రెండో పుష్పానికి మరింత సుగంధం గౌ॥ శ్రీ. డా॥ బూ॥ రామకృష్ణారావు, ముఖ్యమంత్రి హైద్రాబాదుగారి సందే శముతో మరింత ఘుమాళింపు చెందుతోందని మా యాశ. ఈ గ్రంథాన్ని ఆశీర్వాదించి, దయతో మా ఉద్యమానికి, తోడ్పడుతూవున్న, ముఖ్య మంత్రి డా॥ బూర్గుల రామ కృష్ణరావుగారికి, యెంతయు కృతజ్ఞులము.

ఈ రోజులకు తగిన సారస్వతాన్ని శ్రీ శంకర్‌దేవ్ యం. ఏ. వేదాలంకార్, డిప్యూటీ మినిస్టర్ (సమాజ సేవ) హిందీలో రచించిన వ్రాతప్రతిని ఈ పరిషత్తుచే అనువదింప శెలవు యిచ్చినందుకు మా అభివందనాలు సమర్పిస్తూ వున్నాము.

ఈ సంస్థ యిట్టి మహత్తర కార్యానికి, స్వార్థంతోగాక, ప్రజా సేవయే ప్రమాణంగా పెట్టుకొని, హరిజన సామాజిక ప్రతిబంధకాలను క్రమేపి ఛేదిస్తూ రావాలని ముందుకు నడుస్తోంది.

భాషాభిమానులు, సారస్వత ప్రియులు, చదువరులు, యీ మా ఉద్యమంలో సంపూర్ణ సహకారం చూపగలరని, మూడో పుష్పానికి, రంగులువేస్తూ విరమించు, మీ భాషా సేవకులు.

జంటకవులు,
సి. ఐ. ఆంద్రూస్,
యం. జె. త్యాగరాజు.

దళిత సారస్వత పరిషత్,
A/12/375/1 దోమల్‌గూడ,
హైద్రాబాదు-దక్కన్.

# అమరసందేశం

## 1. ప్రకరణము

## చరిత్రగతి మారిపోయింది

హరిజనేతర సోదరీ సోదరులకు, నమస్కారాలు!

నన్ను ప్రియమిత్రునిగా భావించగలిగిన దానికే నేనీనాల్గు మాటలు విన్నవించ దలంచుకొన్నాను. మీకు మాకు మధ్య భావనాకల్పితమగు నొక ఉక్కుతెర అడ్డపడ్డది. అది కాల పరిమితిని బట్టి చిలుముపట్టి గట్టిపడిపోయినది. దాన్ని పెకలించే శక్తులు యిప్పుడిప్పుడే ప్రారంభమయ్యాయి. కాని శక్తి ప్రవాహానికి తగిన సాంఘిక సహకారం దొరుకుట లేదు. ఆకారణం చేత, ముసుకులో గుద్దులాటవలె గాక, ముఖాముఖిగా, యీగ్రంథ రూపంలో ముచ్చటించ దలచుకొన్నాను. దీనిలో నేట్టివిపరీత తత్వంకూడా లేదు.

మీకు మాకు విభేధాలేర్పడి యుగాలు గడిచాయి. ఒకటే బాట రెండుగా చీలి ఏ విధంగా దూరమై పోవునో, అట్లే ఒక్క సాంప్రదాయులే రెండు మార్గా లేర్పర్చుకొని అడవిపాలైనారు. అది మాకర్తవ్యాన్ని పునర్విమర్శ చేయక భిన్నాభిప్రాయం మానవ కోటి యొక్క సామాన్యాకృతిపై నాధారపడి, కులగోత్రాలలో, హెచ్చు తగ్గులలో చిక్కుబడి తహతహ పడుతున్నాము. భరత ఖండము పవిత్ర భూమి, భగవద్భక్తి తాత్పర్యాలకు పుట్టినిల్లు, దానధర్మాలకు నిలయం

భక్తుల, ఋషిపుంగవులకునికి పట్టు, మహాకవి తులసీదాసుచే కీర్తింప బడి, జైన వైష్ణవ ధర్మములకు మూలాధారమై భాగవత దర్మాలకు సారాంశమై, భగవద్గీతలోని ప్రతిశ్లోకాక్షర మందు నిండియుండిన దానము, దయ, ప్రేమ భావాలు, భారతీయ ప్రజలో వ్రేళ్లు పాతుకొని పోయాయి. అందు చేతనే విదేశీయులు మన దేశమువైపు గాంక్షా యుతచిత్తులై కోరచూపులతో చూస్తునే ఉంటారు. ఐతే అమర తరువున గచ్చ చెట్లలమి కొన్నట్లు మన పుణ్య భూమిపై అంట రాని తన మనే గచ్చ పొదలు ఆవరించు కొన్నందు చేత విదేశీ యుల దృష్టిలో, చాలా మట్టుకు మన గౌరవత సన్న గిల్లినది. ఆఫ్రికాలో అమెరికాలో నీగ్రో లున్నారు. కాని వారు అస్పృశ్యులు కారు. ఐనప్పటికీ, పాశ్చాత్యులను మనము నిం దిస్తున్నాము. కొరియా చైనాల మధ్య తగాదాలో తీర్పు తీర్చ డానికి మనము పోయినాము. డచ్చి దేశస్థులు, ఇండో నేశియాను అన్యాయంగా రాజ్యమేలు చున్నారని దెబ్బలాడి నాము. ఈజిప్టు వారికి సూయిజు కాలువపై అధికారముందని బ్రిటనుతో వాదించినాము. వలస రాజ్యాలను విడిచి పెట్టి స్వాతంత్ర్యం చేకూర్చ వలసిందని, పశ్చిమ దేశాలతో పలు మారు వితర్కించినాము. మరి వెనక్కి తిరిగి, మనస్వంత యింటిలో నున్నటువంటి మాలిన్యాన్ని గూర్చి సిగ్గు పడ్డామా? మన హితవులు, నీతులు, బైటివారికేనా? విదేశీయు లేమను కుంటున్నారు? అంటరాని తనమనేది మన దేశంలోనే ప్రభలి ఉంది. భరత ఖండ సరిహద్దులు దాటితే అంటరాని తనమంటే ఏమిటో విశదీకరించుట కూడా కష్టం. అంట రాని తనం మానవ కల్పిత మనీ, దాన్ని పెంచడం, పాలుపోసి

పామును పెంచినట్లే నని, అభిజ్ఞులు అభిప్రాయ పడుతున్నారు.

ఏది ఎట్లున్నా, జాతిభేద, మతభేదాలు లేక, అఖిల భూతముల యెడల ఒకేభావం కలిగి జీవించే మార్గాలను, మన నాయకులు వాదించు చున్నారు. బహుగు దేశాలలో నెకటిగా లెక్కింపబడ్డ మనదేశం, రాజకీయంగా ఉత్తమ స్థానమలంకరించిన విషయం మనకు తెలిసే ఉంది. ఆ పరిస్థితి కార్యదీక్షయు నిష్కళంకమగు సేవచేయ గల్గిన నాయకుల వల్ల జరిగినది.

కాని సాంఘికంగా కూడా, ఔన్నత్య పదవికి రావలెనన్న, అంట రాని తనాన్ని పోగొట్ట శ్రమించ వలసి ఉంది. మేము అంట రాని వారము. మీరు అంట దగిన వారు. అంట రాని తనాన్ని నిర్మూలించా లంటే, మీరు ముందుకు రావాలి. అది మావల్ల అయ్యే పనిగాదు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రాదులను చాతుర్వర్ణ విభాగాంతర భాగములతో వ్యవహరింపబడు పోరాట, ఉత్సాహ వేశ శక్తి సామర్థ్యములతో హరిజన సమస్యను సాధించ వలసి ఉంది. హరిజనుడు జన్మ వల్లగాక, నాతడు చేయు కర్మలను బట్టి అస్పృశ్యు డైనాడు. ధర్మాధర్మాలకు, మంచి చెడ్డలకు, పోరాటము అనాది కాలము నుండి వచ్చు చున్నది. ఇప్పుడూ జరుగు చున్నది. ఇంకా జరుగ నున్నది. మీరు కులీను లన్నప్పుడు, మేము కుల హీనుల మన్న మాట స్థిరీకరింప బడుతుంది, అంటే మీ సోదరులల్లో కొందరిని, మీరు నీచులుగా లెక్కిస్తున్నా రన్న మాట.

ఉత్తమ కులస్థు లనబడు చున్న మీలో నుండి గొప్ప సంఘ సంస్కర్తలు బయలుదేరిన సంగతిమీకు తెలిసేఉన్నది. వారిలో ప్రాముఖ్యులు, శ్రీ రాజారాం మోహన్ రాయ, శ్రీ రామకృష్ణ పరమ హంస, శ్రీ వివేకానంద్‌స్వామి. సర్వెంట్స్ ఆఫ్ ఇండియాను స్థాపించిన గోక్లే, వారి అనుచరులైన అమృత లాల్ ఠాతర్, వెంకట సుబ్బయ్య, శ్రీయుత రనడె, శ్రీ వీరేశ లింగం పంతులు, పిఠాపురం రాజా శ్రీ రఘుపతి వెంకట రత్నం నాయుడు, పండిత రామాబాయి, గుడివాడ లోని శ్రీ గూడారి రామచంద్రుడు, బందరు వాస్తవ్యులగు శ్రీ రాంజీరావు, స్వామి శ్రద్ధానంద్ దయానంద్ ఇక మహాత్మగాంధీ చేసిన పరిశ్రమ వేరే చెప్పవలసిన పనిలేదు.

వీరందరు మీవారే. అస్పృశ్యత హిందూ ధర్మమున కొక మహా కళంకమని ప్రకటించినారు. కాని వీరు ప్రారంభించిన సంస్కరణల కభ్యంతరాలు కల్పించు వారు కూడా మీలోనే ఉన్నారు. మహర్షు లెందరో, పంచమ జాతినుండి లేచిన వారేనని శాస్త్ర ప్రమాణ మున్నది. శాస్త్రార్థ విషయంగా చర్చకు దిగుటకు నాకిష్టము లేదు. అట్టి చర్చ వల్ల మీకు మాకు మనోవేదన కల్గుటకన్న నెట్టి లాభము కలుగదని నే నను కొంటున్నాను. హిందూ ధర్మము అస్పృశ్యతను పాపముగా పరిగణించు చున్నది. కాంగ్రెసు, అంట రాన్ని తనాన్ని రాజకీయ రంగమునందో ప్రాముఖ్య విషయంగా నెన్ను కొన్నది. పూనా ఒడంబడిక ద్వారా తీర్మానమైనటు వంటి హరిజన ప్రత్యేక శాసన సభ్యత్వమును కూడా మీరే అంగీక రించినారు. భారత రాజ్యాంగంలో ప్రతిపాదించింది కూడా మీరే, అనగా రాజకీయంగా, సాంఘికంగా, హరి

జనులు, అస్పృశ్యులు గాక, మీతో సరిసమానం కావలెనని తీర్మానించు కొన్నారు.

ఎందు కంటే, అంట రాని తనం వల్ల, సవర్ణులకు తల వంపులగు చున్నది. అదిక్షమింప బడని కళంకము. ఇంత అన్యాయం జరిగినా, వారిని దూర దూరాన ఉంచినా, శతాబ్ద ములనుండి, వారిని పంచమ జాతిగా పరిగణించినా, వారు మాత్రము మీతో వేరైపోక, హిందూ ధర్మమును గట్టిగా పట్టు కొని, ఉండ టానికి, హిందూ ధర్మంలో యేదో ఒక సూక్ష్మ మున్నూ, అనిర్వచ నీయమగు యేదో విశేషము కలదని నేను గ్రహిస్తున్నాను. ఆవిశేష విషయాన్ని మీరుకూడా గ్రహించినచో. మన ఉభయుల మధ్య ఉన్నటు వంటి అను మానాస్పదమైన భిన్నాభి ప్రాయాలు త్వరలో మాయము కాగలవు. మీరు హరిజనులను అస్పృశ్యులుగా దూరపర్చ లేరు. హరిజనులు మీనుండి వేరైపోరు. ఎన్నో వేల సం వత్సరాలనుండి మీరు మేము యీభరత ఖండంలో జీవిస్తున్నాము. ఇక ముందు ఎన్నో ఏండ్లు జీవించ వలసి ఉంది. ముసల్మానులు వేరై పాకిస్తానుకు పోయినారు. ఇంగ్లీషు వారు, ఫ్రెంచి వారు తమ తమ స్వదేశాలకు వెళ్లి పోయారు. పోర్చుగల్ వారు, నేడొ రేపో పోనున్నారు. కాని హరిజనులు అలాపోయే వారుకారు. కాబట్టి మేము మీలో కలిసి పోయే సదుపాయాలను మీరే కల్పించి మమ్ములను రక్షించ వలసి ఉంది.



హృదయాలు మారిపోయిన
నుదయించును క్రొత్తజన్మ, నుత్కృష్టముగా
నుదయించును నుత్తమోత్తమ
చిదానంద మాత్మశుద్ధి, చిందులు ద్రొక్కన్.

హరిజనులంటె నెవరో
పరాయి వారా, స్వదేశ బాంధవులేగదా
నిరాకరించితె నె
వ్వరు వారికి తోడునీడ, వసుధావళిపై

అంటరానితన మడుగంటుటకై
యేంచేస్తావ్! నీ వేంచేస్తావ్
అధిమాధిక మూఢత్వమడంచుట
కేమంటావ్! నీ వేమంటావ్

హరిజనులే సరిజనులని ప్రజలకు
చెబుతావా! ప్రకటిస్తావా
హరిజనులే సోదరులను వార్తను
వ్రాస్తావా! వివరిస్తావా

# 2. ప్రకరణము

## మనిషికి, మనిషికా!
## అంటరానితనం?

ప్రియులారా, చూడండి. మీదృష్టి అతూర్పు కొండవైపు నిగిడ్చండి. అరుణోదయ మైనది. అది ప్రకృతి రమతో చిందులు దొక్కు సూర్యోదయం గాదు. అది ప్రాపంచక స్వాత్రాతృత్వ చిహ్నాంకురమైన సూర్యోదయం. సంతోష సమాధాన భూయిష్టమైన కిలకిలా రాగాలు వినవస్తున్నవి. మానవ హృదయాలలో, నిగూఢంగా ఉండిన, ఆశాల తలపైని పూవులు పుష్పించినవి. అజ్ఞానాంధ కారం తొలగిపోయే రోజులు సమీపించినవి సర్వ భూతములను సమ భావంతో జూచిన మహర్షులు జన్మించిన యీ ప్రాచీన భూమిలో అస్పృశ్యులపైగల అన్యాయములగు నిర్భంధాలను ఊడ్చివేయు నూతనో త్తేజమగు అరుణోదయ మైనది.

అంటరాని తన మనే పిశాచ ముభయ కంపితమై, పారిపోవుచున్నది. కొత్త అభిప్రాయాలు, కొత్త ఆశయాలు, కొత్త ఉత్తేజాలు, మొలకలెత్తి అష్టదిగ్భాగాలనుండి, ముమ్మరంగా ప్రవహిస్తున్నది. అధములు అధికులు, అనే పదాలకు ముందుండిన అర్థం యిప్పుడు శూన్యమై పోయినది. మన మందరము, మానవుల మనియు, మనలో కొందరిని అంటరానివారిగా పరిగణించే ప్రజలు, పశువులనియు వాందిచే శుభ సందేశ వాతావరణం ప్రబలంగా వీచుచున్నది. నీ కర్మానుచరణ సుప్రసిద్ధమైనదైతే, నీవు ఉన్నతమైన వాడవు, లేదా,

అధముడవు. హరిజనుడు తక్కువ కులమందు పుట్టినందున నీచుడనియు, బ్రాహ్మణుడు ఉత్తమ కులాన బుట్టుట చేత ఘనుడనియు ననుకోవటం ధర్మ సమ్మతమగు వాదం కాదు. నేటివరకు ప్రపంచంలో జన్మించిన మహనీయులలో గొందరగు, గౌతమబుద్ధ, క్రీస్తు, దయానంద సరస్వతి, రామకృష్ణ పరమహంస, వివేకానంద, మహాత్మాగాంధి, వారి విజ్ఞాన వివేచనా శక్తివల్ల ఏమన్నారంటే, మానవుడు తన స్వయం కృతైక శక్తి సామర్థ్యములచేత అధికుడో అధముడో ఔతుంటాడుగాని, యీ అధమాధిక పరివర్తనకూ, మానవుని జన్మకూ ఏలాటి సంబంధంలేదు. అనగా హరిజనుడు ఊరి కావలి పూరి గుడిసెలో జన్మించినా తన కర్మవల్ల, తదేక దీక్షవల్ల, బ్రహ్మజ్ఞాన తత్పరుడై ఉన్నత పదవి నలంకరించ గలడు. అట్లే బ్రాహ్మణ కులానబుట్టినా, దుర్మార్గాల నవలంభించిన బ్రాహ్మణుడు, జన్మవల్ల బ్రాహ్మణుడైనా, కర్మవల్ల నధముడగు చున్నాడు. ఈసిద్ధాంతము వివాద నిదర్శనార్థమై వినియోగపర్చ బడుట లేదు. దీనిని అనుదినం మనం చూస్తూనే ఉన్నాము.

ఈ కాలంలో ఎక్కువ తక్కువలకు చోటు లేదు. మానవులు చేసే పనిపాటలను బట్టియే తక్కువ తక్కువలైనవిగాని, జన్మవల్ల సర్వ జనులు సమానులే నని శ్రీకృష్ణుడు భగవద్గీతలో అన్నాడు. కొన్ని ఏండ్ల క్రిందట, నేటి వాతావరణం లేనప్పుడు, మీకు తెలిసో, తెలియకో, హరిజనుల పక్షాన చాలా అన్యాయంగా నడుచుకొన్నారు. వాళ్లను బళ్లలో చదువుకోనియ్యలేదు. మీగుళ్లవైపునకే రానియ్యలెదు. ఊరి బావుల దగ్గరగానైనా పోనియ్యలేదు. బజారులో తిరగనియ్య

లేదు. మంచి వంటలు చేసికోగూడదన్నారు. దక్షిణ భారతంలో మరీ విపరీతంగా వారిని చూచినారు. సవర్ణులు నడిచే దారులలో, హరిజనుడేగాని నడిస్తే, వాడు వేసిన అడుగులలో కులీనులు పొరబాటున నడిస్తే, కులభ్రష్టత్వం కలుగునన్న మిషచేత, వాడు నడిచే మార్గాలలో హరిజనులను నడవనిచ్చేవారు కారు. ఒక వేళ హరిజనుడు ఆమార్గాన పోవలసిఉంటే, వాడు తన గొంతుకొక ముంతను తగిలించుకొని, నడుముకొక చీపురు కట్టుకొని పోవలసి యుండేది. ఉమ్మివేయవలెనంటే మెడలో నూగులాడు ముంతలో నుమియవలె. నడచిన అడుగుల చిహ్నాలు మాసిపోవుటకు చీపురుతో నాతడు తన అడుగు జాడలను ఊడ్చుచు పోవలెను.

మన హైద్రాబాదు రాష్ట్రాన మొన్నటివరకు కొన్ని అమానుష కార్యాలు జరుగుచుండేవి. పటేళ్లు, పట్వారీలు, దేశముఖులు, ప్రయాణం చేసే సమయాన, వారి సవారి కచ్చరాల ముందు, హరిజనుడొకడు, పశువులాగున, మార్గ దర్శకునిగా, పరుగెత్తుచుండవలె. పగలుగాని, రాత్రిగాని, ఎండగాని, వానగాని, పాపమా హరిజనుడు కుక్కోరి మనక పరుగెత్తవలసి ఉంది. బండ్లలో మీవాళ్లు సుఖంగా కూర్చొని, ఆనందదాయకమగు నూహా ప్రపంచంలో ఉయ్యాలలూగుచుండేవారు. అది ఒకకాలం, అది మారినది. సాంఘిక సంస్కరణాదూతికలు, శుభవార్తల గీతా నినాదాలను, నూతన సంగీత సాహిత్యాలద్వారా, అష్టదిగ్భాగాలకు మారు మోతలు మోగించుచున్నవి. కాబట్టి యిక నట్టి క్రూరకృత్యాలు చేయుటానికి వీల్లేదు.

హిందూ సోదరులారా, యిప్పటికైనా మీ కనులు తెర వండి, మారుచున్న శక్తులతో నేకీభవించండి. ప్రవహించు చున్న నదీనదములను తిరస్కరించి, యెదురీద ప్రయ త్నించకండి. ప్రకృతిరమను పరీక్షించండి. దాని రహస్య తత్వాన్ని గ్రహించండి. దాని ననుసరించి పోవువాడు, దానిలో యిమిడియున్న పవిత్రమగు శక్తుల నంగీకరించి బలవంతుడగు చున్నాడు. కాని ప్రకృతిని నిరసించి, ధిక్క రించి, ఎదురాడినవాడు, ప్రకృతియొక్క పవిత్ర శక్తి వల్లనే దహనమైపోతాడు ఇది మీకు అనుదిన అనుభవము. వేసవి కాలములో సన్నపాటి బట్టలు ధరించి నీవు జీవించ గలవు. చలి కాలానగూడా, అట్లే చాలీ చాలని బట్టలు వేసు కొంటే నీకు వెంటనే జలుబు రావచ్చు, జ్వర పీడితుడవు కావచ్చు. అప్పటికి పోయి కొంత కాలం మందులు సేవించ వలసి ఉంటుంది. అలాగే హరిజనుల పరిస్థితి మారిపోయి నది. వారి వ్యవహారాలు వెనుకటివలెలేవు. ఇప్పుడు చాలా వరకు చదువుకొన్న వారున్నారు. అర్థికంగా ముందుకు వస్తున్నారు. రాజకీయ సంచన కూడా వారిలో కలిగినది. వారిపట్ల మీరు చేయు అన్యాయాలను వారు చక్కగా గ్రహిం చినారు. కాబట్టి మీరు వెనుకటివలె ప్రవర్తిస్తే, ప్రకృతికి ప్రతి కూలంగా పోతున్నారన్న మాట, మన దేశములో స్వరాజ్య ఫలితాలు బయలు పడినవి. హరిజనులు దాన్ని గ్రహించి నారు. అందరు సమానులే, ఒకరికొకరు బానిసలు కారనే గంభీర భావము, కూలి నాలి చేసుకొనే సామాన్య మానవునికి కూడా అర్థమై పోయినది. అందరొకదిక్కు నీవింకొకదిక్కు నడువలేవు. ఈ మార్పులనుచూచి, యిది గొప్ప విప్లవమను

కొనుచున్నారు కాబోలు. విప్లవాలు చారిత్రాంశకమైన విషయం, అవిశుభ సూచకాలు, అవి నీటి ప్రవాహంవలె, అడ్డగించిన, చెట్లు చేమను, రాళ్లరప్పలను, ఇండ్లు వాకిండ్లను, ఊడ్చుకొని పోవుచుండును. ఇంతవరకు ఈ నూతనాభిప్రాయాలతో సమ్మతి పడలేక పోతిరా, అది తప్పని గ్రహించండి. మీరు కాదంటే యీ ప్రగతి నిలచేదికాదు. సాంఘిక మార్పులను ఆపగల శక్తులు ప్రపంచంలో లేవు. విదేశ స్వదేశ చరిత్రలు చదువండి. ప్రతి దేశంలో ప్రతి సంఘంలో మార్పులు కలుగుచునే యున్నవి. విషయాలు విషమించనీయక, విప్లవ రూపముల నవధరింపనీయక, అంతరీయ కక్షల నంకురింపజేయక, దేశములో వీచుచున్న మార్పులయొక్క నిజానిజములను, గ్రహించి వాని కనుగుణ్యంగా నడచినవారే మానవులు, వారియందే మానవత్వముంది, అట్టి ప్రజలతో కూడిన సాంస్కృతియే మానవ నాగరికత. అట్టి దేశమే ప్రపంచంలో గౌరవింప బడుతుంది. ఇది ప్రాకృతిక పర్యవసానం. రాజకీయంగా మరొక మార్పు జరిగినది. భారత రాజ్యాంగంలో ఒక చట్టం ప్రతిపాధింప బడ్డది. అంటరాని తనాన్ని అమలులో పెట్టి, దాన్ని చలామణి గావించువారు శిక్షించబడతారు. ఈ విషయాన్ని మరువకండి. అంతే ఇది బెదిరింపుగాదు. హెచ్చరిక.



పొలమున ధాన్యరాసుల బండ్లకెత్తించి,
తమపిగాతనిపెందు దళిత ప్రజలు
బానెడు జున్నుపాలసు బిండిమీదుచె
తలదాల్చి కొనితెచ్చు దళిత ప్రజలు
తనువును వెగ స్వాతంత్ర్యతకై యర్పి
తముసెయ పరుగిడు దళిత ప్రజలు
రాచకీయా చదరంగ రంగపు పాచి
కల రీతివర్తించు దళిత ప్రజలు
నిలువనీడలేక నీడలు కల్పించు
తనకు లేని దానధర్మమిడుసు
తిండిలేనివాని తినమంద్రుపస్తుండె
దళితజాతికన్న లలితులెవరు?



# 3. ప్రకరణము

## సవర్ణులు తిరుగులేని నిర్ణయానికి రావాలి

శిక్షించితే మానవతత్వం మారుతుందనే నమ్మకం నాకులేదు దొంగలను, హంతకులను బంధించి, శిక్షించి కారాగారాలలో పెట్టవలెను. కాని మీలాటి విద్యావంతులను, శాస్త్రజ్ఞులను, మేధావులను, నాగరికులను, నాయకులను, మాబోటి అధములు, నిరక్షరులు, పేదలు, అణచబడిన వారు, చట్టమును ప్రయోగించి, శిక్షకు పాత్రులను జేయుట మనేది చాలా విచారకరమైన విషయం. ఇది నాకు సమ్మతంగా లేదు. ఇట్టి ప్రయత్నాలవల్ల మన ఉభయుల మధ్య యింతవరకుండిన సూక్ష్మ సంబంధ బాంధవ్యాలు శాశ్వతంగా తెగిపోవచ్చు. హరిజన కులమే వేరై యింకొక కొత్త తెగగా మారిపోవచ్చు, దానిపై రాజకీయంగా, దేశానికే గొప్ప దెబ్బ తగలవచ్చు. కాబట్టి సోదర భావముతో, ధారాళ హృదయముతో, విషయాన్ని విశదీకరించి, పరిస్థితులను సమర్థించవలసి ఉంది. ఇది మీవల్ల జరిగేదేగాని మావల్లగాదు. అనుకొని, తీర్మానించుకొంటే ఇదేమి గొప్ప విషయంగాదు.

ప్రపంచాన్ని చూడండి, భూగోళాన్ని పరిశీలించండి, భారతీయులు ఇండియాలో తప్ప మరే దేశాన రాజకీయ శక్తి గలిగిన వారిగాలేరు. మహమ్మదీయ విదేశాలెన్నో ఉన్నాయి. అట్లే క్రైస్తవ దేశాలుకూడా కలవు. ఐతే హిందూ దేశాలు గాని, హిందువులుగాని, వేరే రాజ్యాలలో రాజకీయంగా లేరు. భారత భూమి యిప్పటికే విభాగింప బడ్డది. ఇక మిగిలిన భూమిలో జీవించుచున్న ప్రజలు ఒకే జాతిగా జీవించు టెంతయో అవసరం, రాజకీయ తాంత్రిక యుక్తులద్వారా, ప్రజలు ప్రాంతీయంగా, భాషా ప్రమేయంగా, అభిప్రాయ పూరితంగా, లెక్కలేని విభాగాలై గ్రూపులై, ఐకమత్యాన్ని

చిన్నాభిన్నాలు చేస్తున్నారు. దీనికి తోడుగా, అస్పృశ్యులని మమ్మల్ని వెలివేస్తే, యిదికూడా యింకొక గ్రూపుగా మారిపోయి మాతృభూమికి గొప్ప కళంకము వాటిల్ల జేయును. మమ్ముల్ని పంచముల లెక్కలో పారవేసి, అవసరమైనప్పుడు, వివిధ పార్టీలవారు, తాత్కాలికానికి కొరముట్లుగా వాడుకొనటం, పని ముగిసిన తరువాత పార వేయటం, అనేది కాలశక్తి కనుగుణ్యంగా లేదు. హరిజనులను వేర్వేరు పార్టీలవారు, ఏవిదంగా, లాలించి పాలించుచున్నారో మీకు తెలిసిన విషయమే. ఆర్థిక దురావస్థకు గురియై, విద్యాగంధము లేని కారణముచేత, భావికాల ప్రపంచ రూపాన్ని తెలిసికొనలేక, హరిజనులు, చిందరవందరగా నాలుగు దిక్కుల నడచుట తప్పక జరుగుతుంది.

కాబట్టి దేశ క్షేమార్థం, సంఘ స్థాయికొరకు, మానవ దృక్పథంతో, అంటు జాఢ్యాన్ని పుటమార్చే ప్రయత్నాలు మీరే చేయవలసి ఉంది. ఇది మీకు నేర్పవలసిన విషయం గాదు. మహాత్ముడు పూనా నిబంధన స్థిరీకరించుట ద్వారా అశ్పృశ్యతా నివారణ ప్రతి భారతీయుని యొక్క వ్యక్తిగత ధర్మమనే విషయాన్ని గంటా నినాదాలతో ప్రకటించినాడు. దాన్ని మనం మరువలేము. దాని నడకను అపుదల చేయలేము. చేసికూడా సుఖ జీవనం చేయలేము. దేశ స్వాతంత్ర్యం మొదటిది అశ్పృశ్యతా నివారణ రెండోది. రెండవది ఫలవంత మయ్యేవరకు స్వాతంత్ర్యం అసంపూర్ణమని గ్రహించవలసి ఉంది. ఎన్ని స్వాతంత్ర దివసాలు ఆచరించినా, ఎన్ని ఉత్సవఖలు గావించినా, ఎన్ని గ్రంథాలు వ్రాసినా, అస్పృశ్యత పోకపోతే, భారతదేశం, అగౌరవానికి గురియై, ముందుకు పోజాలదు. కాబట్టి హిందూ సోదరులారా, నావిజ్ఞప్తిని పెడ చెవిని బెట్టకండి.

హరిజన! జీర్ణశల్యములందు ప్రవహించు
జిగిలేని మూల్గకు చింతసేయు!
హరిజన! రాచకీయనూ బీటివెన్నులై
నిరుపయోగాన్కి కన్నీరురాల్చు
హరిజన! దాస్యశృంఖలముల నిర్మూలింప
శ్రమచేయ నేప్రొద్దు శ్రద్ధదాల్చు
హరిజన! దేవాలయా ప్రవేశానికై
భోజనాదులుమాని ప్రొద్దుబుచ్చు
నట్టి గాంధిమహాత్ముని కనుగుబిడ్డ
లైన, వారికిమీలో! చోటైనలేక
పూరికావలి కాపురముండజూడ?
గాంధి! శిష్యులకివి పాతకంబుగాద!



# 4. ప్రకరణము
# హరిజనులు, గిరిజనులు ఒక్క సాంప్రదాయములే!

హరిజనులు విదేశీయులా? వారిది మీమతము గాదా? వారి అలవాటులకు, భాషకు, సాంస్కృతికి మీకుగల బేధ మేమి? వారు మీకన్నదమ్ములు. మీరక్తములో రక్తము. మీహృదయంలో నొక భాగం. వారొకటి, మీరొకటి గాదు. వారు మీరు అందరు ఒకటే. మీరులేక వారులేరు వారులేక మీరులేరు. మీరు వారు వేరైతే, లోక వృంతమే నడదు. సమాజము విచ్ఛిన్నమై పోతుంది. దీన్ని మీరు ఒప్పుకొని తీరవలసి ఉంది బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు, మానవునిలోని అవయవాలు. కాళ్లులేక నీవు నడవ లేవు. చేతులులేక పని చేయలేవు. నిన్ను ఎవరైన కొట్ట ప్రయత్నిస్తే, నీచేతులు నీకడ్డుపడవలె. నీవుపరుగెత్త వలసియుంటే, నీకాళ్లు నిన్ను తీసుకొని పోవలె. వీటన్నిటిని పోషించుటకు, నీకడుపు సహాయ పడవలె తలకన్న చేతులు తక్కువగాదు, కాళ్లకన్న కడుపు ఎక్కువగాదు. ఏ అవయవం లేకపోయినా నీవు అసంపూర్ణుడ వగుతావు. నీవు చేయవలసిన కార్యాలు సంపూర్ణంగా చేయలేక పోతావు. ఈ అవయవాలను వేరు పర్చలేవు. అవసర మున్నప్పుడు, తగిలించుకో వచ్చులే అనుకో వీలులేదు. అన్ని అవయవాలు, నిన్ను అంటుకొని ఉండి తీరాలి. ఒక దానిపై నొకటి ఆధారపడి ఉంది. ఒకటి యింకొకటికి సహాయపడ వలసిఉంది.

నీపాదంలో ముల్లు గుచ్చుకుంటే, వెంటనే, నీచేయి తోడ్పడి, ముల్లును పెరికి వేస్తుంది. కడుపు చెడితే, అన్ని

అంగులు చెడినట్లే. ఈ అవయవాల మధ్య ప్రతిబంధకమైన సహకారము ప్రతి నిమిషం పని చేస్తుంది. ఒకటి పెద్దది, ఇంకొకటి చిన్నది అనలేము. ఆలోచనలకు తల పెద్దది, పరుగెత్తుటకు కాళ్లు పెద్దవి, దెబ్బలాటకు చేతులు పెద్దవి. నిన్ను పోషించ డానికి పొడుపు పెద్దది. ఆలోచనలకు కాళ్లు పనికి రావు, అందుచేత నవి చిన్నవిగావు. పరుగెత్త టానికి చేతులవల్ల గానందున నవి తృణతుల్యా మన లేము. ఒకదానిపని యింకొకటి చేయలేదు. ఏ అవయవం దానిస్థానే ప్రాముఖ్యమైన అంగంగా పని జేస్తుంది. కాబట్టి, అవయవాలన్నీ అవసర మైనవే, ముఖ్య మైనవే, పెద్దవే. బ్రాహ్మణుడు చేసేది, క్షత్రియుడు చేయలేడు, వైశ్యునిపని శూద్రుడు చేయలేక పోవచ్చు. అందుచేత, ఒకడు యింకొకనికన్న తక్కువయని వాదించుట విజ్ఞాన దాయకంగాదు.

పాకీవాడు ఎక్కువవాడా, తక్కువవాడా? అతని పని నీచమైన పని. పాకీ దొడ్లను శుభ్ర పరుస్తున్నాడు. అందుకని అతనిని నీచుడందామా? బ్రాహ్మణుడు చదువుకొన్నాడు కాబట్టి రచన లాతని చేతులో ఉన్నవి. అందుకని అతనిని గొప్పవాడందురా! న్యాయంగా పరిశీలిస్తే, పాకీవాని పని కష్టతరమైన పని. ఎవరూ చేయ నిచ్ఛగించనిపని. అట్టి పనిని జేయువానిని గొప్పవానిగా భావించుట న్యాయమేకదా? కాన బ్రాహ్మణుడు ఘనుడు కాడు. ఈ విషయంలో బ్రాహ్మణునికన్న పాకీవాడే గొప్పఘనుడు, పాకీవాడే దొడ్లు బాగుజేయక, సమ్మె గట్టితే మన నగరం గతి ఏమౌతుంది? రెండు దినాలలోగా, అశుభ్రత ప్రబలిపోయి, దుర్గంధ పూరితమై, రోగాలు బయలు దేరుతవి. కాని గుమాస్తాలు,

కర్ణాలు, ఒక నెలరోజులు దప్తరాలు మూసి వేసినా, ఏలాటి ప్రమాదం జరుగదు. కాన గొప్పవారెవరు? బ్రాహ్మణుడా? పాకీవాడా? జన్మచేత గాక కర్మచేత, మానవుడు అధముడో, అధికుడో అగుచున్నాడు. పంకమునందు జనించి, కళంకము దేహానికంటనీక, జలాగ్రాన, కమలం వికసిస్తుంటే, దాని జన్మ స్థానాన్నిబట్టి తృణీకరించే మానవుడుకూడా పంకజమైన, కమలంలో లక్ష్మి జనించినట్లు యితిహాసాలున్నవి.

అస్పృశ్యతా నివారణమనగా, అస్పృశ్యులను ఉద్ధరించుటయేనా? లేక ఆత్మోన్నతి కొరకు పాటుపడుటయా? ఆత్మోన్నతి కొరకు పాటు పడవలెసియుంటే, సవర్ణులలోనే యెక్కువ ప్రచారము జరుగవలెను. అస్పృశ్యుల ప్రస్తుత స్థితికి సమర్ణులే కారకులు కావున మీరు పశ్చాత్తాపపడి, మా వారిపైనున్న అస్పృశ్యతా అంకను తీసివేయండి.

అశ్పృశ్యతయను యీ పిశాచము భారత దేశమునందిప్పుడున్న విధాన మెంతకాలమునుండి వచ్చుచున్నదో, ఎప్పుడు జన్మమెత్తిందో ఏకారణంచేత పుట్టవలసి వచ్చిందో, నిర్ణయిస్తానికి తగిన ఆధారాలు లేవు. ఏది ఎట్లున్నా, అశ్పృశ్యత హిందూ ధర్మముయొక్క నిగ్గుగాని, కళంకము గాదు. మునుపెన్నడో జరిగిన దానిని ఊహించుకొని, ఊడలు, బెంచి, ఎవరి యూహ సరియైనదాయను వాద వివాదాలతో ప్రొద్దు బుచ్చుటకంటె, నేడు వారి స్థితిగతులు తెలసికొని, వారిప్పుడున్నది ఉన్నట్లే యుంచుట అధర్మమగునో కాదో యను విషయాన్ని దీర్ఘంగా ఆలోచించి, మన మహర్షుల ధర్మ బోధనలను జ్ఞప్తియందుంచుకొని, ఆత్మపరీక్ష గావించుటే నేడు మీరు చేయవలసిన పని

సీ॥ ఆ సేతుశీతా చలాగ్ర భాగము దాటి
చనలేదు గద! హరిజనులు యెపుడు!

భారత దేశీయ భాషలు విడనాడి
మనలేదు గద! హరిజనులు యెపుడు!

హైందవ పూజా పునస్కార బంధాలు
సమయింప లేదు! హరిజనులు యెపుడు!

జగమెరింగిన హిందుజాతి సంస్కృతి వీడి
చరియింప లేదు! హరిజనులు యెపుడు!

భాష, వేసము జుట్టు పాపటయు గల్గి
దొరల పెత్తనముస్మృతాసరకు గొనని!
రాటుదీరిన హిందు సామ్రాట్టు ప్రతిభ
చాటుచున్నారు హరిజన జాతిమిన్న!



# ౫. ప్రకరణము

## హృదయపరివర్తన లేనిదే చట్టాలు బుట్ట దాఖలు

హృదయాలు మార్చుకొండి. మీకు యిష్టమున్నా ఉండక పోయినా, సంగతులు విషమించి పోవటంచేత, మీ హృదయాలు మారితీరాలి. అస్పృశ్యత అనే కళంకం, చట్టాల ప్రయోగంవల్ల పోయేదిగాదు. అది మీరక్తనాళాలల్లో లీనమై వంశ పారంపర్యంగా దిగివచ్చి, మీలో రెండవ ప్రకృతిగా మారిపోయినది. అంటరానితనం మీలో ఉంది. మాలో కాదు, మీ హృదయాల్లో స్వభావ సిద్ధమై పోయింది, కాబట్టి మీరు మీ హృదయాలను మార్చుకొండి.

భారత రాజ్యాంగాన్ని నిర్మాణం చేసినది మీరు. దాన్ని అవలంభించు బాధ్యత మీమీదనే ఉంది. రాజ్యాంగ ప్రకారం, హరిజనులు, ఊరి బావికిపోయి, నీరు తోడుకో వచ్చును. గుళ్లలో ప్రవేశించవచ్చు, బళ్లలో చదువుకోవచ్చు, మరి అలా చేయగల్గుచున్నారా? మీరు రానీకపోతే, మేమేమి చేయగలమని కుంటిసాకు చెబుతారా!

హరిజనులు ధైర్యము చాలక, సాహసిస్తే పటేళ్లు పట్వారీలు, రైతులు అసలు ఊళ్లోనే బ్రతుకనిస్తారో లేదోనన్న భీతిచే నీళ్లకురాక, గుళ్లలోకిపోక, బళ్లకు పిల్లల్ని పంపక, జంకుతున్నసంగతి మీకు తెలిసియుండవచ్చు. అట్టి సందర్భములో మీకర్తవ్యమేమిటి? మీపై నెట్టి బాధ్యత భారము లేదా? హరిజనులు మీబావులలో నీళ్లు తోడుకోవచ్చునన్న

క్షాంక్ష వాస్తవంగా మీకుంటే, మీరే వారి వాడల్లోకిపోయి, మురికి కాలువల నీళ్లు త్రాగవద్దని చెప్పి, వారికి నాయకులగా నిలచి, నీళ్లు తోడుకొనిపోయే ప్రయత్నాలు చేస్తారు. అదే విధంగా బళ్లకురాక, పశువుల వెంబడి కాపలిగాయు హరిజన బాలకులను మీరే గుంపుగా బట్టి బళ్లకు పంపుతారు. అట్లు మీరు చేయని పక్షంలో, హరిజనులను పైకి లేపనెత్తే ఆశయాలు మీకు లేవని రూఢి యేర్పడుతుంది. వారికి నేర్పుట ప్రోత్సాహ పరచుటకు మించిన మీ విధి ఇతరుల స్వాధీనంలో యుంచలేము. గుళ్లలోనికి, బళ్లలోనికి హరిజనులను పట్టుకొనిపొండి. నాయకులో, మిస్సనరులతో మిమ్ములను బలవంతపెట్టు వరకు వేచియుండవద్దు. హరిజన బాలికా బాలురను మీపిల్లలతో సరిసమానంగా చదువుకోనివ్వండి. వారి పిల్లలు శుభ్రంగా లేకపోవచ్చు, వారికి శుభ్రత నేర్పండి. అదేమి అసాధ్యమైన పనిగాదు. క్రైస్తవులు హరిజన బాలికా బాలురకు శుభ్రత నేర్పుటలేదా? అంతపని మీరునూ చేయలేరా?

ఇంతకు పూర్వం మీరు వెట్టిచాకిరి చేయించుకొనుచుంటిరి. ఇంకా కొన్ని గ్రామాలలో వెట్టి చేయించుచున్నారు. ఇకదాన్ని నిలుపుదల చేయండి. అట్లు చేయించరాదని చట్టమేర్పడినది. అయినప్పటికి, మీరు ఏదో విధంగా పనులు చేయించుకోగలరని నాకు తెలియును. ఇక్కడ శిక్షనుండి మీరు తప్పుకోగలరు గాని, వైకుంఠాన నది తప్పేది గాదు. వారితో పనులు చేయించుకోవలదని నేననుటలేదు కాని పనికి తగిన వేతనాలు యివ్వండి.



సీ॥ గుడిలోన మీపూజ - గుడిబైట మాపూజ
ఎన్నాళ్లు ! చేతుమో అన్నినాళ్లు !

పూరిలో మీబావి - పూరి కావలిమాది
ఎన్నాళ్లు ! వుంతుసో అన్నినాళ్లు !

బడిలోన మీవారు - బడియెదుట మావారు
ఎన్నాళ్లు ! వుందురో అన్నినాళ్లు !

నట్టింట మీతిండి - నడివీధిలో మాకు
ఎన్నాళ్లు ! పెడుదురో అన్నినాళ్లు !

పోదు యీ అంటుజాడ్యము పోదుపోదు
రాదు మతవర్గ రహిత సామ్రాజ్యమింక
పంచములతోడ బాంధవ్య ముంచకున్న
హృదయ పరివర్తనంబు చేనొదవునన్న ?



# 6. ప్రకరణము

## వ్యక్తిగత, హితులు, వినతులు

బ్రాహ్మణులారా, చూచినారుగదా మావారి దారిద్ర్యదశ, నిరక్షరత్వం, అనాదస్థితి, పంచములకు విద్యచెప్పుట పాప మను కొంటిరిగదా? హరిజనులు వేద మంత్రాలు వినగూడ దనిగదా మీయభిమతం. ఇప్పటికీ మీరాలాగే తలుస్తున్నారా? అట్లనుకొనక, మావారికి విద్యా బుద్ధులు నేర్పండి. బ్రహ్మ జ్ఞానము ప్రతి మానవుని అందుబాటులో నున్నది. భాషా సంపద ఎవరిసొత్తూగాదు. సరస్వతి దయ అడ్డులేని సము ద్రము వంటిది. కోరినవారెల్ల తమ శక్తికొలది అనుభవించ వచ్చును. గాన మీరు ఆటంక పర్చక, మావారికి చదువు చెప్పండి, విద్యావంతులను చేయండి, సారస్వమును పోషిం చండి, కవులను ఉద్భవింప జేయండి.

వైశ్యులారా !

కుబేరుని దిక్కరించగల ధన సంపత్తిని సంపాయించు చున్న మీరు మా హరిజనులవైపు ఒక్కసారి, తేరిపార జూడండి. మా వారికి చిన్న చిన్న వ్యాపారాలలో జోక్యం కలిగించండి. వారి బస్తీలమట్టు కైనా వారు వ్యాపారం చేయ గలిగే శక్తి చూపించండి. వారు వ్యవసాయం చేసుకొనే శక్తిలేక, మిమ్ములనాశ్రయించి, ధన సహాయ మడుగగా, పది రూపాయలిచ్చి, వేయి రూపాయలకు పెంచి, కడకు వారి పిత్రార్జితమైన ఎకరమో, రెండెకరాల భూమినో మీరు కుయుక్తితో ఆక్రమించు కొంటున్నారు. ఇప్పటికీ, యీ

రీతిగా కోమట్లు గ్రామాల్లో హరిజనులను బాధిస్తున్నారు. తండ్రికిచ్చిన బాకి, తరతరాలవరకు తీరకపోవటం సరిగదా, అప్పుదీసుకొన్న యింటివారందరు సదా సేవజేసినా, అప్పు తీరదు పైన వడ్డీ పెరుగుతూనే ఉంటుంది. దీనికేదైనా విరుగుడు లేదా? ఈనడవడి మంచిది కాదు. సన్మార్గంలో ప్రవేశించండి. దయను చూపండి. న్యాయంగా ప్రవర్తించండి. బాకీలు తీసుకున్నవారినుండి, బాకీ పడ్డంత డబ్బునే తీసుకొనండి, పని జేయించుకొంటే, పనికి వేతనంగా బాకీని కొట్టివేయండి. అట్లుగాక, అమాయకులగు హరిజనులచే, దొంగ పత్రాలపై వ్రేలు ముద్రలు పెట్టించుకొని, వారి సంసారాలను పాడుచేయబోకండి. మీకు వ్యాపారమున్నది. ఇండ్లున్నవి భూములున్నవి. లేనిచో కొనగలిగిన శక్తి ఉన్నది. కాబట్టి, నిరుపేదలైన హరిజనుల భూములనాశించుట మహాపాపము. అది మీకు నష్టదాయకమేగాని, లాభము గాదు.

క్షత్రియ శూద్రులారా!

మీరు బ్రాహ్మణ వైశ్యులకు హరిజనులకూ మధ్యనున్నారు. మీరు అటు బ్రాహ్మణులు ఇటు వైశ్యులు కారు. హరిజనులు అసలే కాదు. మూవలెమీరు మాంసభక్షకులు. కృషిచేసి జీవించేవారు. కాబట్టి హరిజనుల పరిస్థితి బ్రాహ్మణ వైశ్యులకన్న మీకు బాగా తెలిసి యున్నది. కాబట్టి హరిజన వాడలకు పోండి. వారికష్ట నిష్ఠురాలను పరిశీలించండి. తగిన సమాధానం చెప్పండి. అటు బ్రాహ్మణ వైశ్యులకు, హరిజనుల పక్షాన విజ్ఞాపన చేయండి, ఉభయత్ర న్యాయం జరపండి. మీరుకూడా హరిజనులను తృణీకరించకండి. మీచేతనైనంత వరకు తోడ్పడండి.

భూస్వాములారా !

కనుమేరవరకు నావరించియున్న భూములను చూచు కొని, తృప్తిపడి, కుక్షింభరులై జీవించవలదు. మీకు అనా వసరమైన భూములు, నిరుపేదలైన హరిజనుల కియ్యండి. న్యాయానికేమిగాని, మీభూములన్నిటిని మీరుసేద్యము చేయ గలరా? అసాధ్యమైన భూములు హరిజనులకిచ్చి భూదాన యజ్ఞములో కీర్తిని సేకరించండి. భరతమాత మిమ్ముద్ఘో షించి చెప్పుచున్నది. వినండి పెడచెవి బెట్టవద్దు.

ధనికులారా !

పలుతెరంగులగు వ్యాపారాలు మీచేతులలో నున్నవి. కాబట్టి నిరుద్యోగులైన హరిజనులను. మీదుకాణాలలో, సిని మాలలో ప్రవేశపెట్టండి. ఉద్యోగాలియ్యండి. పుణ్యం కట్టుకొండి. పోషించండి, పనిచేయించుకొండి.

హొటల్ యజమానులారా !

మీకుపనివారు ఎల్లప్పుడు అవసరంకదా ! హరిజనులను మీ పూటకూళ్ల యిండ్లలో పనికి ప్రవేశపెడ్తే, ప్రజలురారని భయపడుచున్నారా? ధైర్యంవహించండి. వారికిపనులివ్వండి. కొంతకాలానికి ప్రజలు, మిమ్మును గ్రహించుకొని, సత్ప్రవర్త నల నవలంభించి అస్పృశ్యతను పాటించరు. రుచి, శుచి యేగదా పాటించేది.

పూజారులారా !

వినండి. మీపై గొప్పబాధ్యత ఉంది. స్వార్థాపేక్ష విడచి, వేదమంత్రాలను హరిజనులకునేర్పండి. మీఅధపత్యంక్రింద

పూజారులుగా హరిజనులను అక్కడక్కడ నియమించండి. పూజారి కావలెనంటే గొప్పవిద్యలవసరంలేదు. మాతృభాష కొద్దిగా నేర్చుకొంటే చాలును. మీ వృత్తిని వారికి నేర్పండి. వారి పెండ్లిండ్లను వారుచేసుకొనే శక్తివంతులను చేయుండి.

న్యాయవాదులారా !

ఎవరుచేయలేని సహాయం మీరుచేయగలిగి ఉన్నారు. గ్రామాదులలో కక్షలచేత, హరిజనులు కోర్టులకెక్కుచున్నారు. వాదిప్రతివాది హరిజనులైతే, వారిరువురికి బుద్ధిజెప్పి, కోర్టుకు పోనీయక, పంపివేయండి. అట్లుగాక, ధనికులు, హరిజనులను అన్యాయంగా కోర్టులకు లాగితే, నిరుపేదలైన హరిజనుల పక్షాన మీరునిలచి, రుసుము తీసుకోక వారికై పని చేయండి. వీలున్న ఎడల, వారుగెలచిన పిదప, న్యాయసమ్మతమైనంత రుసుము గైకొనండి.

వైద్యులారా !

మీరే నిజమైన సంఘ సేవకులు. భగవంతుడు మీలో గొప్ప సేవాతత్పరత్వాన్ని ఇమిడ్చియున్నాడు హరిజనులకు విజ్ఞానంలేదు. ధనంలేదు. రోగపీడితులైనప్పుడు, వైద్యులను సమీపించే ధైర్యంలేదు లోలోనకృశించి నశించుచున్నారు. మీరు, మీస్నేహితులు, వీలైనంతవరకు హరిజనులకు ఉచితంగా చికిత్సచేయండి. పల్లెగ్రామాలకు అప్పుడప్పుడుపొండి. మందులివ్వండి. ప్రభుత్వంవారు మందులు ఉచితంగా యిస్తారు. మీరుసేవమాత్రం చేయండి. అంతేగాదు, హరిజనులకు ఆరోగ్యమార్గాలను నేర్పండి. వారికనులువిప్పండి.

ప్రసూతిస్త్రీలకు సహాయపడి దాయిలను తయారు చేయండి, మానవ సేవయే ! మాధవ సేవ.

క్రైస్తవ మిషనెరీయులారా !

మీ ఆదర్శనీయమైన సేవను నేనెంతయు శ్లాఘించు చున్నాను. నిస్వార్థంగా, చేయుచున్న మీసేవను నేను మరువజాలను. ముఖ్యంగా హరిజనులపక్షం మీరు చేసిన సేవ మహత్తరమైనది. మీధర్మనుచూచి మేము చక్కని పాఠము నేర్చుకొంటున్నాము. ఐతే ఒక సంగతిని మరువ కండి. మీరుమావారికి జాతీయత నేర్పండి. విజాతీయత వలన మావారి సాంఘిక, ఆర్థిక పరిస్థితులు మారిపోవుటయే గాక, వారిసాంప్రదాయాసాంస్కృతి రూపాంతరమగుచున్నది. వారికి భారతభూమిపై అభిమానము కలుగవలెను. సనాతన అధునాతన నాగరికతలయందు కాంక్షలు పెంపొందించు కొనవలెను మీకుతెలసిన విధంగా, మీదేశంలో లోకప్రఖ్యాతి గాంచిన మహనీయులు పుట్టినారు. క్రీస్తు పాలస్తీనులో జన్మించినప్పుడు, తూర్పుదేశాలనుండి, ఆయనను బహూక రింపవెళ్లిన ముగ్గురిలో, భారతదేశస్తుడొకడని చరిత్ర చెప్పు చున్నది. మాదేశముయొక్క ఔన్నత్య దశనుగూర్చి, మా కన్న మీకే ఎక్కువతెలియును. మావేదాలు, శాస్త్రాలు, ఉపనిషత్తులు, పురుషార్థాలు, ఇంగ్లీషు భాషలో మీరుచదివిన వారే. మావెనుకటి ఉన్నతదశను మేముమరల ఎత్తిచెప్పి వ్రాయపనిలేదు. మీదేశస్తులు పశుబలముపై నాధారపడినారు. మేము ఆత్మబలముపై నిలచుచున్నాము. కాబట్టి మాహరి జనులను మీరు లేవనెత్తునపుడు యీవిషయాలన్ని జ్ఞాపక ముంచుకొన్ని, మావారిరూపునామాలుమార్చక, ధర్మనిబద్ధమైన

మార్గాన నడుపండి. హరిజనులను ఆర్థికంగాకూడా లేపండి. క్రీస్తు నేర్పిన తత్వమిదేకదా ! మిమ్మును చూచి మాదేశస్థు లందురు, మంచిమార్గాన నడిచెదరు. సాంఘికసేవ మీవల్ల నేర్చుకొంటారు. కాబట్టి మీరు నిజమైన సేవ చేయుండి. మతాలు మార్చకండి, మనుజులనుమార్చండి. సమా ధాన పారాయణాన్ని భారత భూమిపై ప్రసరింప జేయుండి. మా మతమునకు తోడుగా మీవిద్యకూడా నేర్పండి, అపుడే మానవుడు సంపూర్ణుడవుతాడు.



# 7. ప్రకరణము
# ఇక కర్తవ్యం?

కాంగ్రెసు నాయకులారా ,

నా అంతిమ విన్నపం మీకై నిలుపుదల చేసినాను. కాం గ్రెసుసంస్థ ప్రతి ఊరూర గలదు. బస్తీబస్తీలో ఉంది. హరిజనులలో చేతనైనవారిని, బస్తీకాంగ్రెసులో, జిల్లాకాంగ్రె సులో, తాలూకా కమిటీలలో, గ్రామసభల్లో అభ్యర్థులుగా చేర్చుకొండి. విద్యావంతులైనవారిని, మీసంస్థలలో కార్య దర్శులుగానో, అధ్యక్షులుగానో, లేక ప్రచారకులుగానో తీసు కొనండి. డెవిగేట్లుగాకూడా ఎన్నుకోండి. వారియోగ్యతలను బట్టి, వారికైవారే, పైకిరావలెనంటే, మీవారితోమావారు పోటీగా నిలువలేరు. అర్హులైనవారులేరని మీసంస్థలోకి హరిజనులను తీసుకొనకపోతే, దానివలన మీకేమి గౌరవంకలుగదు? మీరు

పరిశ్రమచేసి, హరిజనులను ఏరుకొని, తర్ఫీతుచేసి, కార్య కర్తలలో వారినిచేర్చుకొండి. ఆలాచేయక పోతిరా, తగిన హరిజన అభ్యర్థులు మీకుదొరుకనేదొరుకరు. హరిజనులలో నాయకులను లేపు బాధ్యత మీపైననే ఉన్నది. వారి గ్రామా లను సంరక్షించుకొనే తెలివితేటలు మీరు వారికి నేర్పండి. వారిలో స్థిరమైన నాయకత్వాన్ని నిర్మించండి. అందువలన, తెలివితేటలు కలిగిన శాసనసభ్యులు, మునిసిపాలిటీ మెంబర్లు తయారు కాగలరు. ఇదంత మామీచేతులలో ఉంది.

అందుకనే! శ్రీ బాబుజగ్‌జీవన్‌రాం, ఒక సంస్థను నెల కొల్పినాడు. దానిపేరు అఖిలభారత డిప్రెస్డుక్లాసెస్‌లీగ్. దానినే దళితజాతి సంఘమంటారు, హైద్రాబాదులో మా సంఘం, అద్భుతంగా పనిచేయుచున్నది. ప్రతిజిల్లా, తాలూకా లో శాఖలు నెలకొల్ప బడుచున్నవి. శాఖలన్నియు కాంగ్రెసు నాయకులసహకారం వల్లనే స్థాపిత మగుచున్నవి. దళిత జాతి సంఘం యొక్క ఆశయాలు, ఆదేశాలు, కాంగ్రెసు ననుసరించియే యున్నవి. కాంగ్రెసుకు దళితజాతి సంఘా నికి ఏలాటి భేదంలేదు.

కాంగ్రెసు సంస్థ యేవిధంగా, గాంధీజి సిద్ధాంతాలకు, నిర్మాణ కార్యకలాపాలకు, కట్టుబడి నడుస్తూవుందో, అవిధం గానే కాంగ్రెసు తత్వంతో, గాంధీజీ ఆశయాలతో, ప్రత్యేకంగా ఈజాతి ఉద్ధారణకై, గాంధీజీ చేసిన త్యాగాలకు, పథకాలకు ప్రత్యేక సీట్లకు, కల్పించిన నిబంధణావళికి, యెంతయు ఋణపడి యున్నాము. ఈ ఋణానుబంధమే, మాకు కాంగ్రెసుకుగల, సంబంధము. ఇట్టి సంబంధం, ఇతర

రాజకీయ పార్టీలతో పెట్టుకొని, దళితులు పురోగమింప లేరు. గనుకనే దళితజాతి సంఘం కాంగ్రెసు కాడిక్రింద, శిరసావహించి, నడుస్తోంది. తత్ఫలితమే, మాకు యిప్పటి ప్రభుత్వానికిగల అనుభవనీయమైన పురోభివృద్ధి. కాంగ్రెసు ప్రభుత్వం యేమి చెప్పినా అదే చేస్తుందని, యీ సంఘం నమ్ముతోంది. అలాగే అనుభవిస్తోంది.

కాంగ్రెసుతో సభ్యుడు కానివాడు దళితజాతి సంఘంలో చేరలేడు. కులమత వర్గాలకు దోహదమిచ్చే సంస్థలను ప్రభుత్వమువారు అంగికరించరు, దళిత జాతీయ సంఘం హరిజనజాతికి చెందినప్పటికీ, భారత రాజ్యాంగం, దీనికి ప్రత్యేకత పదేండ్లపాటు కల్పించటంచేత, దీనిని ఒక జాతికి చెందిన సంస్థగా పరిగణింప వీలులేదు. కమ్యూనిష్టులకు దళితజాతి సంఘానికి సంబంధంలేదు.

కమ్యూనిజం పోవాలంటే, దళిత జాతీయ సంఘాన్ని బలపరచవలె. అంటరానితనం, పేదరికం, అనే సాంఘిక లోట్లను తీసివేసినచో, కమ్యూనిజానికి చోటుండదు. కమ్యూనిష్టులు, సవర్ణులలోనున్న యీ బలహీనతను చక్కగా గ్రహించినారు. దాని కనుగుణ్యంగా హరిజనులకు బోధ చేసి, వారిని దగ్గర లాగుటచేత, కమ్యూనిజం బలపడుతూ వచ్చింది. కాబట్టి, సవర్ణులు, హరిజనులతో కలిసి, మెలిసి అంటరాని తనాన్ని తీసివేస్తే, దేశానికి గొప్ప రాజకీయ పరిరక్షణ గావించిన వారౌతారు.

హరిజ నేతరులే దళిత జాతీయ సంఘాలను నెలకొల్ప వలసి ఉంది. అది మీ బాధ్యత. మీవల్ల ఏర్పడ్డ అంట

రానితనం మీవల్లనే పోవలె. ఇది ఎలా సాధ్యపడుతుందా అని విచారించ బనిలేదు. మీరున్న గ్రామాలలో, తాలుకాలలో, జిల్లాలలో. బస్తీలలో, దళితజాతి సంఘాలను నెలకొల్పండి. వారు అనుసరించవలసిన నియమావళి వారికి నేర్పండి. గాంధిజం చక్కగా వివరించండి. కాంగ్రెసు ప్రచారకులుగా వారిని తయారు చేయండి. వారి హక్కులేమిటో వారికి నేర్పండి, నేర్పడమేగాదు, వాటిని స్వీకరించే సదుపాయాలు చూపండి. మీరున్న గ్రామంలోని కాంగ్రెసు సంస్థలో అర్హులైన హరిజనులను, అభ్యర్థులుగా చేర్పండి. కార్యవర్గంలో ప్రవేశ పెట్టండి. కాంగ్రెసు యొక్క అధ్యక్షులుగా నెన్నుకొనండి. వారిని ముందుపెట్టి మీరు వారిని నడపండి. గుడిలో పూజలకు, బావిలో నీళ్లకు, ఆటంకాలు లేకుండా మీరే హరిజనులను వెంటబెట్టుకొనిపొండి. ఈలా కొంతకాలం మీరు కృషిచేస్తే చట్టముగాని, రాజ్యాంగంగాని, సాంఘిక ప్రచారకులుగాని అవసరముండదు. అంటరానితనం తనంతట అదే మాయమై పోవును. కాబట్టి హరిజనేతరులు యీపని ఇపుడే, మీరున్న ఊరిలోనే ప్రారంభించవలెను. హరిజన సమస్యకు నేడున్నంత రాజకీయ ప్రాముఖ్యత ముందెన్నడులేదు. దీనికి ముఖ్యకారణం ప్రతివ్యక్తి మరొక వ్యక్తియొక్క స్థితిగతుల పట్ల జాలి గలిగి బ్రతుకుచున్నాడు. ఒకదేశ మింకొక దేశమునందు కలుగుచున్న తారుమారులను అనుదినం పత్రికలద్వారా, చదువుచూ సానుభూతి చూపుచున్నది. నీవెవరో నేనెవరో అనేభావం యిపుడు చాలావరకు తగ్గిపోయింది. అందుచేత అంటరానివారు ఆపెంట దిబ్బలలోనె ఉండనియ్య వచ్చునసే

వెనకటి అభిప్రాయాన్ని ఇప్పుడు బలపరచేవారు లేనేలేరు. అంతేకాదు, విదేశీయులు ప్రతిదినం మన ప్రగతిని పరీక్షిస్తున్నారు.

కాబట్టి సవర్ణ హిందువుల యంతరాత్మలకు కొంత బాధ కలిగి, తమంతట తామే యీకళంకాన్ని పోగొట్టే ప్రయత్నాలు చేయవలెను.

దళిత జాతీయ సంఘం దీనికి తోడ్పడుతుంది. దళిత జాతీయ సంఘంద్వారానే మిళిత మేర్పాటు కాగలదు. మన దేశంలో సాధింపబడ్డ సంస్కరణలన్నియూ, రక్తపాత రహితంగానే సాధింపబడినవి. ఇకముందుకూడా అట్లే జరుగ వలసిఉంది. కాబట్టి, హరిజనేతర సోదర సోదరీలు, అంటరానితనాన్ని తొలగించడం వారి కర్తవ్యంగా భావించి, నాయీ విన్నపాలను శిరసావహించి దళిత జాతీయ సంఘంతో ఏకీభవించి, కాంగ్రెసు కార్యక్రమాన్ని, బాపూజీ ఆశయాల్ని, కొనసాగించ బద్ధులై ఉన్నారు.

సెలవు — నమస్తే

జైహింద్



# దళిత సారస్వత పరిషత్

# ప్రచురణాలు.

అచ్చు అయినవి:—

(౧) హరిజన సంఖ్యాపరం [తెలుగు]

(౨) హరిజన సంఘము ల్యాగుల్ [హిందీ]

(౩) దళిత జాతీయ సంఘము దాని కర్తవ్యం [తెలుగు]

(౪) What and Why of D. J. S. [ఇంగ్లీషు]

(౫) అస్పృశ్యతా నివారణకై శిలపత్రాలు రంగు పోస్టర్లు

(౬) "సేవక్" సామాజిక పక్ష పత్రిక. [ఇంగ్లీషు తెలుగు]

కానున్నవి:—

(౧) దళిత ప్రశ్నోత్తర చంద్రిక [తెలుగు]

(౨) చిరంజీవి మనుమానికి తాత, [తెలుగు]

(౩) Harijan Today & Tomorrow [ఇంగ్లీషు]

(౪) నాటికలు, బుర్రకథల పాటలు, గ్రామ ప్రచారకులకై, శిక్షాగ్రంథాలు వున్నవి.

వలయువారు.

మేనేజరు:
దళిత సారస్వత పరిషత్,
A/12/375/1 దోమల్ గూడ,
హైద్రాబాదు-దక్కను.

నేషనల్ ఫైన్ ప్రింటింగ్ ప్రెస్, చార్ కమాన్, హైద్రాబాదు-దక్కను.